## —* విజ్ఞాపనము. *—

---

ప్రస్తుతము నాచేరచియింపబడిన

1. శ్రీవేంకటేశ్వర పాదుపుకథల పాత్రము.
2. ఈశశతకము.
3. లోకచరితము.
4. నానాసంభాషణము.

ముద్రణంబునకై పుణ్యాత్ములకొఱకు నెదురుచూచుచున్నవి.—అట్టి భక్తవరులు తమకోరికను దెలియఁబరచిన నా గ్రంథంబుల వినిపించి యానందించువాఁడను.

బోర్డుహైస్కూలు
తణుకు
18—3—20



ఇట్లు
దుడ్డు సర్వేశ్వరశాస్త్రి
సహోపాధ్యాయుఁడు

ఓం

శ్రీలక్ష్మీనారాయణాయనమః

# శ్రీమారివిఘ్నేశ్వరరామచంద్రశాస్త్రికదంబము.

ఇది

శ్రీలక్ష్మీనారాయణచరణారవిందధ్యాన[illegible]యుణ్ణు[illegible],
కాశ్యపసగోత్రోద్భవుండును దుద్దు [illegible]
చంద్రుండును కామయసుబ్బమాంబికా
చతుర్థపుత్రుండును, నగు సర్వే
శ్వరకవిచే విరచితంబయి

శ్రీ గంగాభాగీరథీ సమానురాలగు మునికుల
గోత్ర కోడూరి సుబ్బమాంబికా
విత్తసహాయంబుచే ప్రకటింపంబడియె.



రాజమండ్రి శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలలో
ముద్రింపఁబడియె.

1920

వెల ౦—౧—౦

## భగవద్ధ్యానము

ఉ. ఏవిభుఁ డీజగంబులను నెక్కువ ప్రజ్ఞను జేసి వాటిలో
జీవులఁ బెంపగా నుబడు చిత్రపు జిత్రపు భోజ్యమిచ్చి వా
నేకవిధమ్ము వ్పగా నొలయ మేర్పడఁజేయు మసృష్టి జేయునో
యావిభు నిస్మదీయగురు నాహరి నేస్మరియించి మ్రొక్కెదన్.

## —◆ భగవత్కృప. ◆—

ఉ. సర్వమయుండు మానవుల స్వాంతములోపలబై జగంబులో
నిర్వచనీయుఁడై వెలసి నిక్కపు భక్తుల చేస్వ కార్యముల్
సర్వము నిర్వహిల్ల దనసాయము జేసెడు మంచిచెడ్డ స
ర్వస్వలవోలె జూపెడును గూర్మిశుభాశుభ సూచనాళిచేన్.

తే. జ్ఞానిసూచన లెంచు నజ్ఞానివాని
లెక్కజేయక పొందెడు బెక్కుచిక్కు
లపుడు దేవుడదృశ్యుఁడై యుటనె యుండి
తెగుసు మతినొసఁగి భక్తవత్సలుఁడనబడు.

ఇట్లు

సిద్ధార్థి నామసం॥ర ఫాల్గుణ
బ॥ ౧౧ మంగళవారము
తెనాలి

శ్రీలక్ష్మీనారాయణ ప్రీతుండగు
నిమిత్తమాత్రుండునగు
దుడ్డు సర్వేశ్వరకవి.

ఓం

# ప్రస్తావము

తే. ధరణిరాజోలు తాలూక మెఱయుచుండి
చెలగు వెలిచేరు గ్రామాన వెలయు వైశ్య
కులజగోపూరి సూరయకు న్గృహిణియు
నై నసుబ్బాంబను సుశీల ననఘచరిత.

తే. ఆయురారోగ్యవృద్ధులనందగాను
వేదవిహితంబుగాను దీవించియామె
పుణ్యశీలము హరిభక్తిమోదముతోడ
నించుకను నేర్చినట్టు వచింతునివుడు.

వం॥ మునికులగోత్రయాచుదన పూర్వపుణ్యముచేత జ్ఞానియై
పనిపడి పుణ్యగాథలను భక్తులచేజదివించునాదరం
బునవినుబాత్రిగ్గనుచు మోదముతోడదనార్థికోటిని
వినినిడితుష్టిజేసెదును వేలకువేలనుఖర్చుజేయుచున్

సీ. వేణుగోపాలుకో వెలలోనధ్వజమెత్తి
వాహనంబులమర్చ స్వామికిబ్రీతి
సంవత్సరంబున జరపించు కళ్యాణ
మునకిచ్చిచాలగ భూతటమును.

పులిదండిలోనదా బుణ్యంబునార్జించె
తనుకుసిద్ధేశ్వరు ధ్వజముకూడ
బాగుచేయించెను పవమానసుతురూప
విగ్రహంబును జేయు విత్తమిచ్చె
ఆ. పయిడిపర్రినందు భద్రాద్రివాసుఁడౌ
రాము నామకోటివ్రాయజేసి
వెడలనుండెనటకువీక్షింపవానిని
సుప్రసిద్ధచరితసుబ్బమాంబ.

తే. హరిహరులనిర్వురందునునమితభక్తి
కలుగునీమెకుమనుమఁడాగమిడివంశ
జుండువిఘ్నేశ్వరుండునుసొబగుమీరు
అన్నపూర్ణమ్మయనుమనమ్మరాలుగలరు.

ఆ. కాళ్లకూరికొలవుగన్నె మైవెలసి సీ
తమ్మనాఖ్యచేతదనరునాపె
కూడనీమెపౌత్రి కామరాజువీరలు
పుత్రపౌత్రవృద్ధి బొందెదరుగ.

ఆ. విష్ణుసూరిమఱియు వెంకయ్యసూరియు
రామసూరి నేను వ్రాసినట్టి
స్తోత్రములను భక్తిసుబ్బమాంబవినుచు
నచ్చునొందజేసె నర్థమిచ్చి.

కం. పండితసత్కారంబే
యుండెనుగాయంచు జెప్పనుక్తివినుచు దా
మెండుగ రూప్యంబులగొని
నిండించెను నాదు చేయి నిశ్చలభక్తిన్.

తే. వేదులాన్వయసంభవు విప్రవర్యు
సూర్యనారాయణాహ్వయు కార్యఘటన
సాయమొనరించినట్టి యాశతావధాని
సాటియొజ్జనుదలంచుదు సంతసమున.

ఇట్లు

తణుకు
16—3—20

శ్రీహరిదాసుడు
దుడ్డు సర్వేశ్వరకవి.

ఓం !

శ్రీలక్ష్మీనారాయణాయ నమః.

(నానాసంభాషణములోనుంచి)

శ్రీహరిస్తోత్రము.

క. శ్రీహరి నీవే దైవము
శ్రీహరి నిలువుము మదీయచిత్తమునందున్
శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి నన్నుంచు నీదుచిత్తమునందున్.

క. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి ననుమఱవకుమయసి తోనుస్సన్
శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి నినుమఱవనట్టి చిత్తంబిడుమా.

క. శ్రీహరి నను మఱవకుమయ
శ్రీహరి శ్రీహరి యనంత శ్రీగుణధామా
శ్రీహరి నీనామామృత
మే హరియని గ్రోల జెప్పుమీ నామదితో.

క. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి శ్రీహరి సమస్త శ్రీకళ్యాణా

శ్రీహరి ననుగావుమయా
శ్రీహరి బ్రహ్మాదివంద్య శ్రీహరిదేవా.
౮. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి నీలోరమించు శ్రీభక్తవిభో
శ్రీహరి హరనుతవిభవా
శ్రీహరి ననుబ్రోవనెంచు చిత్తములోన్
౯. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి ముల్లోకనాథ శ్రీమానాధా
శ్రీహరి సన్నేలుమయా
శ్రీహరి బ్రహ్మాదిదేవ చిత్తవిహారా.
౧౦. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరి హరబ్రహ్మముఖ్యచిత్తవిహారా
శ్రీహరి నారదవంద్యా
శ్రీహరి శ్రీహరియనంగ జిత్తంబిడుమా.
౧౧. నాలో నీవిటుతప్పులు
మేలే హరియెంచనాదు మెయిబాధబడన్
ఏలోపమింక నెంచక
చాలగదయయుంచి బ్రోవు నచయాఁడవాగుచున్

క. శ్రీహరి శ్రీహరి శ్రీహరి
శ్రీహరియని నీదుసేవ జేయుచునీకున్
జోహారు లిచ్చుచుంటిని
సాహాయము జేసి ప్రోవు సదయుఁడవగుచున్

క. నవతులిరుప్రక్కలంగన్
నివసింపగ వక్షమందు నిలచిన సిరితో
పవన విహారమునల్వాడు
నవనీశ్వరనల్లనయ్య నూలింపుమినన్.

శ్రీలక్ష్మీనారాయణార్పణమస్తు.

ఓం !

శ్రీవిఘ్నేశ్వరస్తోత్రము.

క. శ్రీపార్వతీశప్రియసుత
నీపాదాబ్జములఁ గొలుచు నెఱభక్తులలో
నేపాటివానిపనులను
లోపంబులఁ జేయవనెడు లోకఖ్యాతిన్

క. వినినీప్రాపునుగోరుచు
ననిశము నినుఁగొలుచు మమ్ము హర్షముతోడన్

గనుచుండి వనులఁగూర్చుచు
ననవరతము బ్రోవుమాకు నభయంబిమ్మా.

క. ఉప్పాడ కొత్తపల్లెను
నొప్పారగ వెలసి మమ్ము నూరక విడువన్
దప్పేమి మేము చేసితి
మెప్పగిదిని మెప్పగంటిమిఁక విఘ్నేశా.

క. పనిచెఱుపులదూరవౌదవు
మనమున సత్కార్యములను మాపును జేయన్
బనులను దలఁచెదనదానకు
బనిగూర్చెదు వాఁడవీవు భక్తులకు మెలన్.

క. ఎవరికిఁ జెప్పఁగనగుగా
భువిలో నీమహిమకల్మి భూరిబలాఢ్యా
శివకేశవులే కొల్తురు
నవినయముగ నిన్ను బనుల నల్పెడువేళన్.

సీ. తలయంటుకొనునాఁడు, తల్లిపార్వతినిన్ను
దల్పుదగ్గఱనుంచి తనయుపరుఁడు
గడపదాఁటకయుండ, గనుచుండుమనినీవు

ఖడ్గంబుఁ జేఁబూని గరళకంఠు
నడుగైన సడనీక, కడుమగంటిమి జూపి
కరవాలమును ద్రిప్పి పరగుచుండఁ
బసివాఁడవౌ నిన్నుఁ బరమేశుఁ డింతైనఁ
బరిభవింపఁగ లేఁడు పౌరుషమున

తే. గీ. ఒప్పియుండెను నాఁడు నీగొప్ప తెలిసె
అట్టినీదగు ఘనతను నెట్టులైన
బ్రహ్మ చెప్పఁగలండొకో పరమభక్త
లోల విఘ్నేశ మమ్ము బ్రోవుము లోటు లేక.

సీ. తుండంబు ద్రిప్పుచు, దో దుజంబు నంది
మదిసలరెడు వేళ మఱవకయ్య
మూషక మెక్కుచుఁ బూసిక బోవుచు
మదిసలరెడు వేళ మఱవకయ్య
వీటిలో నీకిడు విందారగించుచు
మదిసలరెడు వేళ మఱవకయ్య
పితలదగ్గరనుండి ప్రీతితో సలుపుము
మదిసలరెడు వేళ మఱవకయ్య

తే. గీ. ఈడువారలు గూడుచు నాడుచుండి
మదిని నలరెడు వేళను మఱువకుండ
భక్తవరులగు మాదగు పనుల నెల్ల
విఘ్నములు లేక చేయవే విఘ్నరాజ.

౪. ఎలమిని నీ ప్రార్థనమును
సలలితముగ జేయు దుద్దు సర్వేశ్వరున
న్నలరెడు వేర్వేరు భక్తుల
గలుములచే బ్రోవుగాత కరిరాడ్వదనా

కీర్తన

(స్మరహర శివశంకర భోవలె)

పల్లవి॥ వెనకయమము బ్రోవుమయు, విఘ్నరాజదేవ॥ వెన॥
మా మొఱాలకింపుమిక మదవి గరుణబూను॥ వెన॥

1. పాండుసుతుల భండనమున। బాగుగ గాచినటుల॥ వెన॥
2. దమయింతికి దిరుగ నాథు। దయచేసినటుల॥ వెన॥
3. దుద్దుసర్వేశ్వరుః బ్రోచు। దొడ్డమేటిదేవ॥ వెన॥
శ్రీలక్ష్మీనారాయణార్పణమస్తు.

ఓం.

## రామచంద్రస్తోత్రము.

ఉత్పలమాలికావృత్తము.

లంకకు సార్వభౌముఁడగు। రావణుఁ గెల్చి తదీయసోదరున్।
జంకక రాజు జేయుచును। జానకితో బంగరంబుతోడని।
శ్శంకనయోధ్యకుజ్జనగ, సంతసమొందుచు రాజుఁజేయని।
స్పంకజపీఠమందునిజ ! భార్యను జేర్పఁగ జెట్టబట్టనీ॥
యంకమునందు సీచెలిసు। భాసనమైవసియుంపనెచ్చెలి।
జ్జంకను జేర్చిపట్టగభు। జంబులమీదను ‘‘నీదెభారమా।
పంకజనేత్రిరాము’’ యన భామకరంబునువేసిభాసిలన్।
బొంకము మీర జంచలనుఁ బూనిననల్లఁ మేఘమాయనన్।
శంకనుగల్గజేయమెయి। చందపుటందముముద్దులొల్కఁగా॥
శంకకసోదరద్వయము । గూర్చుచు వీవనవేయుచుండనీ
వంకకునెండరాకఁకి। బట్టగము త్రైపుభత్రిమొందునీ।
కింకరుడంజనీసుతుడు । కేలుఁమోడ్చినుతించుచుండగా।
శంకల మాన్యవర్గమును। జేఁకలు కోర్వగమానులెల్లనీ।

కింకను దీవనంబులిడ । నెంతటి వైభవమొందియుంటివో।
శంకర బ్రహ్మ ముఖ్యసుర। సంఘము స్వర్గ రాక చాటునీ।
కింకరుడో ఘనేనుడవ। కీర్తి విశాల శ్రీలోకనాయకా॥

ఉ. శ్రీపతి నీమహామహిమ । చిత్తము నద్దముపోసి చూడగా
నీపయివారు లేరనుట । నిక్కము నమ్మితినాదు పాపసం
తాపమడంచి నీకృపను। దాపును జేయుచు నీపదాబ్జమే।
తేపగ బూజకై యొనగి తేల్చను నన్ను భవాబ్ధిలోపలన్.

తే. దుష్టులను శిక్షజేయుగ దొడ్డవారి
రక్షణంబును జేయగ రాముడగుచు,
బుట్టితివిగా వయీనాడు భూమిగాన
నేడు శ్రీరామనవమియీనాడు ముందు.

కం. ఏనాడు బుట్టి పెరిగితొ
యీనాటికినైన నిన్ను నెవ్వరు మఱవన్
గానము కారణమేమన
భూనాధా నివు విష్ణుమూర్తి వికాదే.

కం. నీసేవయె భూజనములు
చేసెడు కార్యంబటంచు జెప్పెదరదిగా

కే సామాన్యునకైనను
నీ సాన్నిధ్యంబు జేరనిదియే తోచున్.

కం. కావున నిను గొలువంగను
నీవడువున జేరియుంట యీకార్యములో
నావంతలోటు జేయక
నీవే కాపంగవలయు నిక్కము రామా.

ఇది

శ్రీ లక్ష్మీనారాయణ చరణారవింద ధ్యాన
పరాయణుండును కాశ్యపగోత్రోద్భ
వుండును దుగ్గువంశాబ్ధిచంద్రుండును
కామయ సుబ్బమాంబికా చతుర్థ
పుత్రుండును నగు సర్వేశ్వర
కవి విరచితంబు.

సర్వము సంపూర్ణము
శ్రీ లక్ష్మీనారాయణార్పణమస్తు

సంపూర్ణము.

